# Golkonda Patrika

Volu 16 — No 77 | *Published on every Monday and Thursday — Hyderabad Dn.* | 9—2—1942

## స్థానిక వార్తలు

మహబూబునగరు తాలూకాలోని బాడి పల్లిలో ప్లేగు ప్రారంభమైనదని ప్రభుత్వమువారు ప్రకటించినారు.

... ... ...

హైదరాబాదునగరములో కొత్వాలి గారిసెలవు లేకుండా ఇక ముందెవ్వరున్నూ థియేటర్ సంగీతశాల, సినిమాహాలు సర్కసు ఇత్యాదులు కట్టగూడదు, దానికి సంబంధించిన నియమాలను ఏర్పాటుచేసినారు.

... ... ...

తా ౧౫ ఫిబ్రవరి ౧౯౪౨ గురువారమునాడు సాయంత్రము ౬ గంటలకు ఆర్యసమాజము శాలిబండా లో శ్రీమాన్ పూజ్య పం. సి. వి.- స్వామిజీ, ముఖ్యాధిష్ఠాత, దయానంద అనాథాశ్రమము నిజామాబాదు గారిఉపదేశముకాగలదు,

... ... ...

హైద్రాబాదునుండి గతవారము కొందరు నాయకులువార్ధాకు మహాత్మాగాంధీగారితో ఆలోచించుటకు వెళ్ళినారనియు కాశీనాథరావువైద్యా, స్వామిరామానందతీర్థ, కోటీచామన్నగారు వెళ్లినారనియు తెలియవచ్చుచున్నది.

... ... ...

పండిత రవిశంకర్ శుక్లాగారు హైద్రాబాదుకు వచ్చుచున్నారు. ఈనెల గురువారం ౧౨ఫిబ్రవరి సాయంకాలము ౬ గంటలకు రెడ్డిహాస్టలులో వారు ఖాదీనిగురించి ఉపన్యసించుచున్నారు.

... ... ...

సుబాంపంజకాజ్ గారు మెదకు పెన్షన్ జడ్జిగారు ౭ఫర్వరి నాడు నిజామాబాదుదౌరా వెళ్ళిరి. శుక్రవారము తిరిగివచ్చుచున్నారు.

... ... ...

సాతిక సంవత్సరముల రహబరదక్కను పత్రికాసంపాదకులు మౌల్వీసయ్యద్ అహ్మదు మొహియుద్దీన్ గారు సోమవారము నాడు మరణించిరి.

... ... ...

విమానాలనుండి బాంబులుకొస్తే ప్రజలు దాని నుండి యెట్లురక్షించుకోవలెనో దెబ్బలుతగిలితే ఎట్లు ప్రాథమిక చికిత్స చేయవలెనో అనివమాలు నేర్పుటకు హైద్రాబాదునగరములో ౧౫ఫర్వరి నుండి ౧౩ ఆసుపత్రులలో నేర్పుదురు- స్త్రీలకు గాను విక్టోరియా జనానాఆసుపత్రిలో నేర్పుదురు. అభిలాషులందరును తమకు దగ్గరగానుండు ఆసుపత్రిలో విచారించి ఉచితముగా ఈవిద్యను నేర్చుకొనవచ్చును.

### జపాను యుద్ధము

(మొదటిపేజి తరువాయి)

విన్నియర్డ్, అలూషియన్ అనుచోట్లనుండి జపానీయసేనలుతరిమిరాగా అవిసైన్యముచేతరిమి వేయబడినవి.

డచ్చివారిఈస్టిండీసుదీవులలో జావాలో సౌరబాయా మీదను బటావియామీదను, బంకాదీవి పైనున్నప్పు మీదను, పాలెంబాంగుమీదను, ఉత్తరసుమిత్రా మీదను. న్యూగినీలోఒక చిన్న చోటుమీదను జపానీయవిమానాలు ౨వతారీకున బాంబులనువేసినవి-

ఫిలిప్పైనుదీవులలో మనిలాసీధుశాఖ ముఖద్వారమువద్ద అమెరికనుదుర్గములపై కొత్తైటు గట్టునుండి జపానీయులు ఫిరంగులను మళ్లీ రావతారీకున ప్రేల్చినారు. బాటన్ ద్వీపకల్పముపై జపానుసేనలు దిగినవి-

న్యూగినీప్రాంతమందు సాలమన్దీవులమీదను, సామరాల మీదను జపానీయ విమానాలు ౨వతారీకున బాంబులనువేసినవి- ఆస్ట్రేలియాలోను డార్విన మీదకి శత్రువిమానాలు వచ్చుచున్నట్లు ౧వతారీకు మధ్యాహ్నము హెచ్చరిక చేయబడెను- కాని ఎట్టివిమానాలును రాలేదు-

వరంగల్ జిల్లా మహబూబాబాదు తాలూకా లోకల్ఫండు మహాకమా కార్యదర్శిగారి కార్యాలయమునుండి

### ప్రకటన

ఇందుమూలముగా అందరకు తెలియజేయుట యేమనగా మహబూబాబాదు తాలూకాలోని కొరివిగ్రామమందు శ్రీవీరభద్రస్వామివారిజాతర 11నుండి మొదలుకొని 19 ఫర్వరి 1351ఫ. వరకు మామూలుప్రకారము జరుగును, భగవంతుని అనుగ్రహమువల్ల కొరివి గ్రామములోగాని, చుట్టుపట్టులలోగాని ఎట్టివ్యాధులు లేవు. యాత్రికులు మరియు వ్యాపారస్థుల కొరకు సాధ్యమైనన్ని సౌకర్యము లేర్పాటు గావింపబడినవి.

యిట్లు

మౌల్వి సయ్యద్ గులాం అక్బర్ సాహెబ్ బియాబానీ,

(కార్యదర్శిగారు)



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.